శ్రీరామ

శుభమస్తు

# రాఘవ శతకము

శ్రీరమణీ యురస్థలి వసింప బయోజ భవామరేంద్ర బృం
దారకు లాశ్రయింప సతతంబు మునిప్రవరుల్ నుతింప నొ
య్యారముగా బయోధినురగాధిపుపై పవళించియుండు ల
క్ష్మీరమణున్ భజింతు ఫలసిద్ధికి నే గడుభక్తి రాఘవా.

పావనమైన విఘ్నపతి । పాదము లర్చనజేసి భారతీ
దేవిని సంస్కృతాంధ్రకవి । ధీరుల సన్నుతిసల్పి మద్గురున్
భావమునం దలంచి గురు । భక్తిని బెద్దల నాశ్రయించి నీ
సేవయొనర్చి నే గవిత । జెప్పఁగబూనితి వీరరాఘవా. 2

అక్షయమైన గార్యముల । నైదిఁట నొక్కటి చూడలేదు నే
లక్షణము న్గనుంగొనను । లక్షణసారము నప్పకావ్యమున్
దీక్ష నెఱుంగలేదు పటు । ధీరత నీశతకంబు నో జగ
ద్రక్షక నే రచించెదను । రక్షణసేయగదయ్య రాఘవా. 3

మాధవ నీ సునామజప । మంత్రరహస్య మెరుంగ నద్రిజా
నాథుఁ డహల్య తుంబురుఁడు । నారదుఁ డాధ్రువుఁ డాగుహుండు
ప్రహ్లాదుఁడు నంబరీషుఁడు । ఖగాధిపుఁ డావిదురుండుగాక యే
సాధులు యోధులున్ దెలియ । సాధ్యమె భేద్యమె వీరరాఘవా. 4

పామరుఁడఁ జడుండఁ గడుఁ బాతకుఁడఁ గుణహీనుఁడఁ మహా
తామసుఁడఁ ధురంత మద, దర్పుఁడ నీచుఁడ దుర్విచారుఁడఁ
నీమములేనివాఁడఁ బర నిందలొనర్చెడువాఁడ మూఢుఁడఁ
తామరసాక్ష నన్నెటుల ధన్యునిజేయుదువయ్య రాఘవా. 5

శ్రీరఘువీరమిత్రకుల సింధుసుధాకర మేరుధీర శృం
గారశరీరగోత్ర ధర కల్మషదూర సమస్తజీవితా
ధార భయాపహార వర దారణశూర సురాదిభక్తమం
దార మహోపకార పర తత్వవిచార ముకుంద రాఘవా. 6

పారసపత్రనేత్ర ముని సన్నుతగాత్ర పవిత్ర సద్గుణో
దార పురారిమిత్ర శుభ దాయక పూతచరిత్ర సుందరా
కార విచిత్రపంక్తిరథు గాదిలిపుత్ర కకుత్సగోత్ర ల
క్ష్మీరమణీకళత్ర నుతిఁజేసెద దానవజైత్ర రాఘవా. 7

శ్యామలకోమలాంగ బుధసన్నుత సాధుమనోబ్జభృంగ శ్రీ
రామ దయాంతరంగ ఖగరాజ తురంగ మదారిభంగ నీ
నామప్రసంగమెంతయు వినంగ వినంగ కడుఁ మదీయ హృ
త్సీమ జెలంగెఁ బ్రేమ విను జేరెద మోక్షమొసంగు రాఘవా. 8

పాడెద రంగరంగ యని పాటలు పాతకముల్ హరింప నే
నాడెద ధిత్తధిత్తయని యచ్యుతుజెంత ముదంబుమీరగా
గూడెద దాసదాసుల నకుంఠితభక్తి లభింప కోర్కెమై
వేడెద దేవదేవుని బవిత్రుని విష్ణుని నిన్ను రాఘవా. 9

గానముఁజేసి మెప్పుగన , గానల నారదమౌనిగాను నీ
ధ్యాన మొనర్చుచుండ త్రిపురారినిగాను గుహుండగాను నీ
మానస మేనెరుంగ హను।మానుఁడగాను ధృవుండగాను నే
గానుక లీయగా శబరి । గాను జడుండను బ్రోవు రాఘవా. 10

పాయస మిక్షుఖండముల । పానక మాజ్యము పాలు తేనె క
జ్జాయము వెన్న జున్ను దధి । చక్కెఱ మీగడలందు పెక్కు పా
నీయములందు నేమరక । నిల్చిన రుచ్యముకన్న మిన్న నా
రాయణ నీకథామృత । రసాయనమే గద వీరరాఘవా. 11

మ్రొక్కెద నీపదంబులకు । మ్రొక్కెద నే భవదీయమూర్తికిన్
మ్రొక్కెద కౌస్తుభంబునకు , మ్రొక్కెద సీతకు లోకమాతకున్
మ్రొక్కెద శేషపాన్పునకు । మ్రొక్కెద లక్ష్మణమూర్తికిన్ సదా
మ్రొక్కెద పక్కిఱేడునకు । మ్రొక్కెద మోక్షమొసంగు రాఘవా.

పట్టెద నీపదాబ్జములు । పట్టుగ మోమున బట్టెనామముల్
బెట్టెద దిట్టనౌచు నొక । పెట్టున బాతకరాజినెల్ల పో
గొట్టెద నట్టహాసమున । క్రూరమనస్కుల గాలుదూతలన్
నెట్టెద మోక్షమీవలెను । నిర్దయబూనక వీరరాఘవా. 13

అండజవాహ తొల్లి ప్రళ।యంబు ఘటించినవేళ నీటిచే
నిండి ప్రవాహమై మిగుల । నిర్మలమై జనశూన్యమై ధరా
మండలి యొప్పనప్పుడు గ్ర । మంబున బ్రోవఁగ నండపిండ బ్ర
హ్మాండములెల్ల గుక్షి నిడినట్టి మహాత్ముఁడ వీవు రాఘవా. 14

నీవె సమస్తలోకములు । నీవె చరాచరజంతుజాలముల్
నీవె నవగ్రహంబులును । నీవె పయోధులు పర్వతంబులున్
నీవె సమస్తవేదములు । నీవె హరుండవు నీవె బ్రహ్మయున్
నీవె జనింపఁ బెంపగను । నీవె లయింప దలంప రాఘవా. 15

శ్యామలదేహ నిన్ గనని । జన్మము జన్మముకాదు భక్తితో
వేమరు నీకథల్ వినని । వీనులు వీనులుకావు నీదు స
న్నామము సంస్మరించని మ।నంబు మనంబునుగాదు సామి నీ
మోమునుగాంచి మ్రొక్కఁడని।మ్రొక్కును మ్రొక్కునుగాదు రాఘవా·

సారససంభవుండు గిరి।జాత విభుండు ఖగేంద్రుడున్ సునా
శీరుఁడు చంద్రభాస్కరులు । శేషుఁడు ముప్పదిమూడుకోట్ల బృం
దారకులాదిదేవతలు । తాపసవర్యులు నీమహాత్వ మిం
పార నెరుంగలేరుగద । భవ్యచరిత్ర పవిత్ర రాఘవా. 17

తల్లివి నీవె ప్రేమగల । తండ్రివి నీవె గురుండు నీవె రా
జిల్లు సఖుండు నీవె మఱి । జీవము నీవె సమస్తబాంధవం
బెల్లను నీవె నన్ను దయ । నేలఁగ నీవె వరంబులీయ శ్రీ
వల్లభ నీవె పెంపెసగు । భాగ్యము భోగ్యము నీవె రాఘవా. 18

తలచిన నిన్నె దల్చవలె । దాశరథీయని జిత్తశుద్ధిగా
బిలచిన నిన్నె బిల్వవలె । బెక్కుతెరంగు లహర్నిశంబులున్
గొలిచిన నిన్నె గొల్వవలె । గోరికలిచ్చిన నీవె యీవలెన్
జెలఁగు నన్యదైవములఁ । జేరిన నేమి ఫలంబు రాఘవా. 19

నమ్మినవారి బ్రోవఁగను । నమ్మకమౌ బిరుదాంకితంబు లో
కమ్మున సాటి మిక్కిలి ప్రకాశముగాంచిన దాతవంచు నే
నమ్మితి నా మనంబున ఘనమ్ముగ మిమ్ము వరమ్ము లిమ్ము ని
త్యమ్ము కరమ్ము నీమృదు పదంబుల నెమ్మి భజింతు రాఘవా.

చేసితి ఘోరకృత్యములు । చేసితి సూరిజనాపచారముల్
చేసితి దుష్టకార్యములు । చేసితి మిక్కిలి జీవహత్యలుఁ
జేసితిఁ జోరతంత్రములు । చేసితి నే శుభకార్యభంగముల్
చేసితి దోసము ల్మిగుల । జేతలు చూడక బ్రోవు రాఘవా. 21

దాసుల నిందఁజేసి బహు । తప్పులొనర్చినవాడనంచు నా
దోసములెంచి దుర్గతికి । ద్రోసెదవేమొసుమీ రమాధవా
దాసులుసేయుతప్పు లొక । దండముతో సరిపోవుగాన నీ
ధ్యాసయొనర్చి యేనిడెద । దండములఁగొను వీరరాఘవా. 22

దండము రామచంద్ర శుభదాయక సద్గుణసాంద్ర నీకిదే
దండము రాజచంద్ర ఖరదానవ మత్తకరీమృగేంద్ర నా
దండముగొ న్సురేంద్ర వినుతా పరిరక్షిత సన్మునీంద్ర నే
దండ మొనర్తు భక్తిగను , ధన్యుని జేయగదయ్య రాఘవా. 23

మొర వినరాద దేవ యిదె , మ్రొక్కితిగాద రమావినోద నా
దురితము బాయలేద మది । దోచద భక్తజనానుమోద నే
స్థిరమతి నీదుపాదములు । సేవయొనర్చెడువాడ వేగ నీ
కరుణను జూపరాద నను । గాసిలిబెట్టుట వాద రాఘవా. 24

కోరితి దేహసౌఖ్యములు । కోరితి నే పెరవారి సంపదల్
దూరితి బంధువర్గముల । దూషణఁజేసితి పుణ్యకాంతలన్
మీరితి పెద్దలాజ్ఞలను । మించితి నే కులధర్మముల్ సదా
జేరితి నన్యదైవములఁ । జేష్టల నెంచక బ్రోవు రాఘవా. 25

ఓ కమలాక్ష యో సదయ । యోశరణాగతరక్షణ మేరుధీ
రా కరుణాకటాక్ష మద । రాక్షసశిక్ష విశాలవక్ష యో
శ్రీకర యింత కక్షలిక , సేయకు తాపసకల్పవృక్ష రా
వే కరుణించి మోక్షమియ । వే నిను గొల్చెద వీరరాఘవా. 26

మాధవ పల్కవింత చల,మా బలమా పలుమాటలేల శ్రీ
నాథ ముకుంద నేను తగ।నా పగనా నగుమోముజూప వీ
వాదము లాడనీకు తగ।వా నగవా పగవా మురారి న
న్నాదరణించు సాధుహృదయా సదయా దయజూచి రాఘవా. 27

భక్తజనంబులెల్లఁ గడు । భక్తిని దాళమృదంగవాద్యముల్
రక్తిగ మ్రోవ దేవ రఘు।రామ పరాత్పర వాసుదేవ యో
భక్తపరాయణా వరద , పావనయంచు భజించువేళ నా
సక్తిగ నర్తనంబుచట । నల్పు మహాత్ముఁడ వీవె రాఘవా. 28

ఓ యదువీరధీవర ప।యోధిగభీర ముకుంద యాదినా
రాయణ భక్తవత్సల । పరాత్పర దీనశరణ్య వాసుదే
వా యిటు రావెరావె యని । పల్మరు పిల్చిన సమ్మతించి యో
హోయని పల్కరాద సుగు।ణోదధి నీకిది వాద రాఘవా. 29

పుట్టినదాదిగాఁ జెడుగు । పొట్టకుఁ బట్టెడుకూఁటికై సదా
పుట్టలు చెట్లు కారడవి । భూములు మిట్టలు గుట్టలు న్మహా
పట్టణముల్ వడిందిరిగి । బాధలనొందితిగాని భక్తితో
పట్టుగ నీపదాబ్జములు । పట్టిభజించగనైతి రాఘవా. 30

సత్తువ తప్పువేళను , విషజ్వరము న్గఫవాతపైత్యముల్
గుత్తుకతట్టి ప్రాణములు । గూఢముగా బిగబట్టినప్డు నా
చిత్తమునందు నీస్మరణ । సేతునొ చేయనొ నాటివంతుకే
యిత్తరుణంబునందు భజి।యించెద భక్తివహించి రాఘవా. 31

బంటు ప్లవంగయూధపతి । పానుపు పన్నగరాజు భార్య పే
రంటముసేయు కోమలి తు।రంగము రంగుల గ్రద్ద బావ మి
న్నంటినవాడు పుత్రకు డ।నంగుఁడు కూతురు చంచలాంగి నీ
వంటివ సూత్రధారుఁడ వ।హో నినుగాంచు టదెట్లు రాఘవా. 32

వెంగలి సోమదైత్యుఁ డవి।వేకముచే మును నాల్గువేదముల్
దొంగిలి నీరవారధిని । దూరిననాడు మహా।ఝషంబవై
చెంగున నద్దురాత్ము వధ । చేసి శృతుల్ గొనివచ్చి ధాత కు
పొంగుచు నిచ్చినట్టి రఘు।పుంగవ నన్గరుణించు రాఘవా. 33

నీవు సురాదిదేవుఁడవు । నేను పురాకృతకర్మజీవుడఁ
నీవు దయాంతరంగుఁడవు । నేను మహాకలుషాంతరంగుడఁ
నీవు త్రిలోకవంద్యుఁడవు । నేను చతుర్దశలోకనింద్యుఁడఁ
నీవును నే సమంబె నను । నీవెటు బ్రోచెదవయ్య రాఘవా. 34

వింటిని భక్తబృందముల । వేమరుపాలనజేతువంచు నే
గంటిని నీస్వరూపమును । గన్నులపండువుగాను భక్తితో
నంటిని దేవదేవ పర । మాత్మ ముకుంద హరేయటంచు నే
గొంటిని నీప్రసాదమును । గోమలదివ్యశరీర రాఘవా. 35

నడువను దప్పుత్రోవ లిక । నాడెములౌ పరభాషణంబులన్
ముడువను నీ సమర్పిత సముజ్జ్వలపక్వముగాని భోజ్యముల్
విడువను సుస్థిరంబగు వికుంఠపదంబు నొసంగకున్న ని
న్విడువను రామచంద్ర రఘువీర మహీధర ధీరరాఘవా. 36

నుడివెద రామమంత్రమును । నోట నిరంతరము న్ముదంబుతో
గడిగెద భక్తవర్గపదకంజయుగంబుల భక్తిమీరగా
దొడగెద నీపదార్చనవిధుల్ సమకూర్చు సుమంబులెల్ల ని
న్నడిగెద మోక్షమిమ్మని జనార్దన పావననామ రాఘవా. 37

పురముల గోరలేదు ఫలభూముల దెమ్మనలేదు నే వనాం
తరముల వేడలేదు ధనధాన్యము లిమ్మనలేదు భూరిమం
దిరముల నెంచలేదు సౌరిదిన్ మణిహారము లడ్గలేదు స
ద్వరముల కాసజెంది శుభదాయక నిన్భజియింతు రాఘవా. 38

స్థిరములు నీవరంబులు యశేషదివౌకసరాజికిన్ శుభో
త్కరములు నీగుణంబులు సదా నిజభక్తజనాళికి న్మనో
హరములు నీమృదూక్తులు యహర్నిశమర్చనజేయచూడ సుం
ధరములు నీపదాబ్జములు । దాసవిలాస రమేశ రాఘవా. 39

పుట్టుట యొక్కచోట తను । పోషణ సేయుట యొక్కచోట నీ
పట్టణమొక్కచోట మఱి । పానుపు వేరొకచోట వైరులఁ
గొట్టుట యొక్కచోట సుర । కోటులు గొల్చుట యొక్కచోట
యిట్టి చరిత్రసొంపు యిల । నెందును గల్గదు చూడ రాఘవా. 40

మామను జంపినాడ వొక , మామను బంధనజేసినావు నీ
భామను వీడినావు భళి । బావను మింటికి బంపినావు బల్
తామసగాడ వీవు తలి । దండ్రుల సంకెల లుంచినావు నీ
వేమి దయార్ద్రచిత్తుఁడవొ । యేను వచింపగలేను రాఘవా. 41

ఎంతటివాడవోయి నిను । నేమని దూరుదునోయి నాపయిఁ
బంతము పూనకోయి పలు । బాముల బెట్టకుమోయి యిప్డు నా
చెంతను జేరవోయి మఱి । మూతిన మీసము లేదటోయి నీ
చింతన జేతునోయి నను । శీఘ్రమె బ్రోవగదోయి రాఘవా. 42

కొందఱు నవ్వుచుండ నిల । కొందఱు దుఃఖముజెంద నిచ్చలుఁ
గొందఱు సౌఖ్యమంద మఱి , కొందఱు కష్టమునొంద గూటికిఁ
గొందఱు భిక్షమెత్తగను । కొందఱు భాగ్యముచే నటింప నీ
చందము చేయుచుండుదు వసాధ్యము నిఁ దెలియంగ రాఘవా.

జ్ఞానములేనివాడు పర । కాంతలఁ గోరెడువాడు నీపద
ధ్యానములేనివాడు మద । దర్పమునఁ జరియించువాడు సు
జ్ఞానుల దూరువాడు భవ । కర్మచయంబులు సల్పువాడు స
న్మానము లేనివాడు నిను । నమ్మి భజించునె వీరరాఘవా. 44

ఒక్కటి నిల్పి రెండు మఱి।యొక్కటిచేసియు మూటి వీడియుఁ
జక్కఁగ నాల్గుకోరి మది । సంతసమందుచు నై దెరింగి తా
జిక్కక నారిఁటిఁ వదలి । సిద్ధినిజెందిన మానవో త్తముం
డక్కజమైన నీపదవి । నందుట కేమి కొఱంత రాఘవా. 45

పూలవనంబులందు ఫల।భూములయందు సుశీలరందు గో
శాలలయందు మ త్తగజ । సంచయమందు ఫలాదియు క్తమౌ
సాలములందు సాధుజన । సంఘమునందు గుణాలయందు భూ
పాలురయందు నిత్య మెడ।బాయక లక్ష్మి వసించు రాఘవా. 46

పెద్దలులేని యూరు పిలి।బిచ్చము పెట్టనివానిపేరు నీ
రొద్దికలేని యేఱు శృతి । కొప్పఁగ బాడఁగలేని నోరు బల్
సుద్దిగలేని నీరు పొగ।చూరిన చారు వినంగ కారణం
బెద్దియులేని పోరు వృధ।యేగద మాధవ వీరరాఘవా. 47

పండని చేలు ఘుమ్మని సు।వాసనగొట్టని పూలు తీయగా
నుండని పాలు కష్టముల । కోర్వని యాలు కృతఘ్నుపాలికిఁ
దండిగ జేయు మేలు । సరితప్పిన రూలు నధై ర్య చేతిలో
నుండిన వాలు నెన్నఁగఁ బ్ర । యోజనమెంతయు లేదు రాఘవా

కల్లరివాని మాట శృతి । గల్పని పాట ఫలప్రవృక్షముల్
గొల్లగలేని తోట ప్రభు । కొల్వు వసించనికోట యూరివా
రెల్లరు పోని బాట నుతి । కెక్కని వేట సమ స్తవ ర్తకం
బెల్లను లేని పేట ధర । నెంతయు హీనముకాదె రాఘవా. 49

పెద్దలులేని యాగము న। పేక్షలువీడని వాని యోగముఁ
బుద్ధివిహీను త్యాగము సు।పుత్రులు కల్గనివాని భోగ మే
యొద్దికలేని రాగమును। నూడిన బీగము దీర్ఘరోగముఁ
హద్దులులేని భాగము ని।రర్థకమేకద వీరరాఘవా. 50

కొమ్మలులేని చెట్టు నొక। కొమ్మ యెరింగిన గుట్టు పెక్కు వా
క్యమ్ములురాని భట్టు ముడి। కందని జుట్టు దురాత్మ తిట్టు యు
ద్ధమ్మున లొంగుతట్టు ప్రమ।దంటున బెట్టనిపెట్టు పాపి ని
త్యమ్ము వచించు నొట్టును వృ।థాగద మాధవ వీరరాఘవా. 51

కామినిరేని గేహము వి।కాసముఁ జెందనివాని గేహముఁ
పామరు స్నేహముఁ సలిల। పానముచేసిన పోని దాహముఁ
చీమలుపట్టు లేహము సు।శీలమునెంచని వేశ్య మోహముఁ
హేమముకాని లోహము మ।హీస్థలి శోభిలుపెట్లు రాఘవా 52

తైలములేని దీపము ప్ర।తాపముచూపనివాని కోపముఁ
గోలలులేని చాపము సు।కోవిదుఁ డెంతయుగాని రూప మ
శ్లీలు డొసంగు శాపము బ్ర।సిద్ధజలంబులేని కూపముఁ
బూలిన సూపము న్విఫల।ముల్గద నిక్కముగాను రాఘవా. 53

చెల్లని పద్దు మోహమును। జెందని ముద్దు విశేషభక్తి సం
ధిల్లని యొక్క ప్రొద్దు భువి। దిన్నఁగ దున్నఁగలేని యెద్దు శో
భిల్లని కర్ణదుద్దు రిపు। బీరమడంచని గ్రుద్దు తీర్పులో
చెల్లని హద్దు నెంత శ్రమ।జేసిన నేమి ఫలంబు రాఘవా. 54

మానసమందు దేవుని స।మానముగాగ దలంచి నిత్య స
న్మానముగా నటించి యభి।మానము ప్రాణము దానధర్మముల్
మానుగ మోక్షమంచు నను।మానములేక నిజేశుపాదముల్
మానక పూజసల్పగల । మానిని పావనిగాదె రాఘవా. 55

అత్తలు మామలు న్మఱదు । లాప్తులు బావలు నాడుబుట్టువుల్
చిత్తములందు సంతసిల । జెప్పినజొప్పు నటింపకుండి తా
బెత్తనదారియై శ్రమల । బెట్టుచు దిట్టుచు గొట్టుచుఁ పరా
యత్తత సంచరించగల । యాడుది గాడిదెగాదె రాఘవా. 56

నిత్తెము రామరామ యని । నిన్ను తలంచక భిన్నబుద్ధిచే
బత్తిగనేమొ వీరక త।పంబ జనంబులు సెప్ప పామరుల్
మొత్తములొచు దేవతల । ముందర గొఱ్ఱెపొటేళ్ల కుత్తుకల్
గత్తుల నుత్తరించి బహు । గంతులువైతురదేమొ రాఘవా. 57

బిచ్చము బిచ్చమంచు కడు । బీదలు సాదలు కుంటిగ్రుడ్డివా
రెచ్చటనుండి వచ్చినను । హేళనజేసి నికృష్టమానవుల్
పిచ్చియ వెఱ్ఱియా యనుచు । బిచ్చము పెట్టక కొట్టి తిట్టుచుఁ
వచ్చినత్రోవ పొమ్మని క।వాటము వేతురదేమొ రాఘవా. 58

విద్దెగలారమంచును క।వీంద్రులమంచును వచ్చినారు మీ
సుద్దులు పద్దులేమి కడు । సొద్దెములేమి తమాసలేమి మా
యొద్దను కాసులేదిచట । నుండక పొమ్మని బుద్ధిహీనులై
పెద్దల గద్దరించుదురు । పెంకెజనంబు లదేమొ రాఘవా. 59

పచ్చని పట్టుపుట్టములు । బంగరుసొమ్ములు వెండిగిన్నెయల్
దెచ్చిననాడు మెచ్చుకొని । తెమ్మని రమ్మని వారకామినుల్
ముచ్చటచూపి యవ్విటుల । మోహముదీర్తురు వట్టిచేతులన్
వచ్చినవాని గెంటుదురు । వాకిలిదాట నదేమొ రాఘవా. 60

పండితులెల్ల జూడ తన । బంధులుగూడఁగ నగ్నిసాక్షిగా
పెండిలియాడినట్టి పతి । పేరు గతించిన ముండమోపియై
యుండిన రండ యొక్కని , కులోచితధర్మము తప్పి సమ్మతిన్
దండిగఁ బెండ్లి యాడును గదా కలిచిత్ర మదేమొ రాఘవా. 61

కష్టముచేసి చెమ్మటలు , గ్రమ్మ గణించిన ద్రవ్యమెల్ల సం
తుష్టిగఁ దాను బాంధవులతో భుజియింపగ ధర్మమీయగా
నిష్టములేక వడ్డి కిడి , యెంతయు జాగ్రతగాను దాచు పా
పిష్టికి జన్మజన్మముల , బిచ్చము పుట్టునటయ్య రాఘవా. 62

పండిన పంట ధాన్యమొక , ప్రాతరపోసి ధనాసచేత నే
పండుగకైన దా దినక । పాఁకుడుచూకెడు మెక్కిరొక్కమున్
దండుగ పాలుసేతు రొక , ధర్మముసేయగబుద్ధికల్గ దా
మొండిపిశాచకట్టెలకు । మోక్షముగల్గునటయ్య రాఘవా. 63

పుట్టును డబ్బు దిట్టముగ , బొట్టకుఁ బట్టెడు కూటికంచు బల్
పట్టుగఁ దప్పుసాక్ష్యములు । బాసలు చెల్లనివ్రాతలున్ సదా
గుట్టుగఁజేసి తా మితర । కొంపలు కూల్చుదురట్టి దుష్టులన్
పట్టి పరేతరాడ్భటులు । బాధలు పెట్టరటయ్య రాఘవా. 64

దానములంచు నెంచు పలు । దానములందున నన్నదాన భూ
దాన హిరణ్యదాన గృహ । దాన నవాంబరదాన కన్యకా
దాన సుపుత్రదాన తిల । దాన నిరంతర ధాన్యదాన గో
దానము లెన్నియైనను ని । దానముతో సరిరావు రాఘవా. 65

ఋతువులలో వసంతమును । ఋత్విజులందు వసిష్టుడు న్మహా
వ్రతములలోను ద్వాదశి సు।వాక్యచయంబుల సత్యముం బతి
వ్రత సతులందు జానకియు । స్వాములలో రఘువీర నీవునుం
మతములలోను సమ్మతము , మాన్యముగాదె తలంప రాఘవా.

వృక్షములందు కల్పకము । విద్యలయందు వితర్కశాస్త్రిముం
బక్షులలో విహంగపతి , పండితులందున వ్యాసుఁడుం సురా
ధ్యక్షులలోను శంకరుఁడు । నద్రులయందు సుమేరువెట్లకో
రక్షకులందు నెన్నఁగఁ బ।రాత్పరశ్రేష్ఠము నీవె రాఘవా. 67

విద్దెలనెల్ల నేర్పి యవి।వేకము మాన్పి ప్రవీణుచేసియుం
బుద్ధులనెల్లఁ దాగరపి । పూజ్యునిగాగ నొనర్చిన న్మహిం
పెద్దల హద్దుమీరి తన । బీరము సూపెడు బుద్ధిహీనునిం
తద్దయు శుద్ధమొద్దనుచు । తప్పక చెప్పుదురయ్య రాఘవా. 68

మక్కువకల్గియున్న తన । మాటలకు న్బదులాడకున్న బల్
చక్కనిదైన బెక్కు సర।సంబులు సూపెడిదైన భక్తితో
మ్రొక్కెడిదైన రేబవలు । మోహముజెందెడిదైన భార్యపై
నెక్కువ ప్రేమతో జనవు । నీయఁగరాదు విభుండు రాఘవా. 69

ఘన నిబిడాంధకారముగ । గప్పిన మేఘములెల్ల గాలిచే
తను విడిపోయినట్లు మద । దర్పముచే తన ధర్మపత్నితో
ననయము లేనిపోని కల।హంబు లొనర్చినవాని సంపదల్
జను నిది నిశ్చయం బటులు । సల్పగరాదు నరుండు రాఘవా. 70

కత్తులు నారసంబులు మొ।గంబుల బాహుల గ్రుచ్చవచ్చు బల్
బత్తిన తానమాడి యుప।వాసము లుండగవచ్చు ప్రత్తితో
వత్తులజేసి దీపములఁ । బాగుగఁ బెట్టఁగవచ్చు ముక్తికై
చిత్తమునిల్పి నీ స్మరణ । సేయు టశక్యము వీరరాఘవా. 71

నాయము చెప్పవచ్చు సవ।నంబు లొనర్పఁగవచ్చు ద్రవ్య మా
దాయము సేయవచ్చు । దశదానము లన్నియు నీయవచ్చు రా
మాయణ భారతాదికథ । లందలి యర్థ మెఱుంగవచ్చు నా
రాయణ వేడ్క నీ పదవి । నందగ శక్యముగాదు రాఘవా. 72

అప్పును దీయరాదు గురు । వాజ్ఞను మీరగరాదు తీర్పులో
దప్పును జెప్పరాదు పర । దారల భంగము సేయరాదు తా
గొప్పని పల్కరాదు తన । గుట్టు బయల్పడరాదు పెద్దలన్
దిప్పలు పెట్టరాదు భువి । దీనులఁ గొట్టగరాదు రాఘవా. 73

ఊహ లడంగినం దన వ।యోపరిపాకము దీరినన్ నిరు
త్సాహము కల్గిన న్మదిమి । సంభవమైనను పామరుల్ సదా
దేహబలంబు దప్పినను । ధీరతవోయిన జూపు దప్పినన్
మోహము వీడజాల రతి । మూర్ఖులుగారె తలంప రాఘవా. 74

చాలగ ధాన్యరాసులును । సంపదలుఁ గృహమున్న దంచొగిఁ
బాలను ద్రాగుచుండు పసి । పాపల వృద్ధుల కిచ్చి పెండిలిన్
బోలఁగ జేయజూతు రిల । మూర్ఖులు ప్రాయమురాగ బాల లే
లీల సుఖంబుగాంతురు । భళీభళి దోసముగాదె రాఘవా. 75

నేమములేని కామినులు । నిష్ట పతివ్రతలైరి యక్షరం
బేమియురాని మూఢజను । లెంతయు బండితులైరి సత్యముఁ
సామములేని తామసులు । చక్కని తీర్పరులైరి నిచ్చలుఁ
గాముకులుఁ గృతఘ్నులు సగౌరవులై రిగదయ్య రాఘవా. 76

కల్ల నిజంబుగా బలికి । కక్షలు బెంతురు దుష్టకామినుల్
చెల్లని పాపకార్యములు । చేతురు కొందఱు పూరుషాధముల్
తల్లిని దండ్రిని న్విడిచి । తామె భుజింతురు పుత్రులౌర యీ
కల్లజగాన ధర్మము ప్రకాశము గాంచునటయ్య రాఘవా. 77

కొంచపు మానవు ల్మిగుల । గ్రూరత దప్పులుపన్ని యెంతయో
మంచిగనున్నవాని కవమానముచేసిన గీర్తివోవునే
పంచలనుండి శ్వానములు । భవ్వని దూకుచు కూసినంతనే
వంచన గల్గునా సమద । వారణరాజునకెందు రాఘవా. 78

కూటికి గుడ్డకుం ధనము , గూడును బెల్లుగనంచు భావమున్
దేటగ దెల్పలేని యువతీమణి నెవ్వనికేని యమ్మి బల్
వాటము చిక్కెనంచును వివాహముచేసెడు పాపకర్మ లే
నాటికినైన సద్గతి ఘనంబుగ గాంతురె వీరరాఘవా. 79

చెట్టున గొమ్మలాకులును । జెల్వగు పుష్పఫలాదులున్నచో
బట్టుగ దేశదేశముల । పక్షులు మక్కువ జేరునట్లుగా
గట్టు దుకూలముల్ నగలు । కాసులు గల్గిననాడు వేడుచుఞ
జుట్టములైనవా రతని । చుట్టును గూడుదురయ్య రాఘవా. 80

బిడ్డలఁగోరి నిష్టమెయి । బెక్కువ్రతంబులు గొడ్డురాలొగిఞ
దొడ్డగజేసి సంతసముఁతోఁ దడిగుడ్డలతోడ గుళ్లలో
నడ్డముగా బరుండి మది । యందున దేవుని వేడినంతనే
బిడ్డలు పుట్టునా దొలుత । పెంచిన పాపముబోక రాఘవా. 81

తల్లి కుచంబులోన విదితంబుగ దుగ్ధము కల్మి లేమియుఞ
బిల్ల యెఱుంగలేక బహు । పీడ యొనర్చినరీతి చూడగా
నల్లుఁడు రాజసేవకులు । యాచకులం గనలుఞ గృహస్థునిఞ
బెల్లుగ బాధ సేయుదురు । పెంకెతనంబు వహించి రాఘవా. 82

తారలు వేనవే లొక సుధాకరుతో సరిగాని భాతిగా
గ్రూరులు దుస్వభావు లతి । కోపులు నూర్వురకంటె సద్గుణో
దారుఁడు వంశపావనుఁడు । ధార్మికు డంచితకీర్తివంతుడుఞ
శూరుఁడుగా జెలంగు నొక । సూనుఁడు మేలు తలంప రాఘవా.

కాయము శుద్ధిలేక తొలి । కర్మలు వీడక సిద్ధిగాక కా
షాయదుకూలముల్ జటలు । చయ్యన దాల్చి విభూతిబూసి గం
జాయిని బీల్చి మత్తుగొని । సామిని జూచితినంచుఁ బల్కు యా
మాయలమారి యోగి కిహ । మా పరమా పరికింప రాఘవా. 84

ఆరయ జీవధారులకు । నాశ్రయమైన రసాన్న మెంతయుఁ
భూరి విషజ్వరాది రుజ।పూరితుఁడెట్లు సహింపకుండునో
సారముగల్గి సద్గతికి । సాధనమై స్థిరమై చెలంగు నీ
తారకమంత్రము న్వినడు । ధాత్రి మదాంధనరుండు రాఘవా. 85

కార్యము ముందు సాగినను । గార్తెకు ముందుగ నుక్కినఁసదా
యార్యులు లాభమబ్బదని । యందు రదేగతి మేకపోతు గాం
భీర్యము సూపి ధర్మములు । పెక్కు వచించుచు పామరుండు స
త్కార్యము సేయనోపడు గ।దా వరదా రఘువీర రాఘవా. 86

పాసిన వంటకంబుగల । భాండముపై పరిశుద్ధి సేసినఁ
భాసురమై చెలంగు పరి , పక్వరసాన్నముగానిభంగి దా
జేసిన పాతకంబు నొక । చెంగున గట్టుక కాశి కేగినఁ
దోసము వీడునా యని బు।ధుల్ వచియింతురు వీరరాఘవా. 87

కాననభూములందుగల । కంటక రాల సమూహమందునఁ
రాణ సెలంగుచుండు మణి । రత్నములెట్లు ప్రకాశమొందునో
మానవనీచవర్గముల । మధ్య నిరంతరముఁ జరించినఁ
ధీనిపుణుండు నల్దెసల । తేజము గాంచుగదయ్య రాఘవా. 88

సారసపత్రలోచనల । జన్మమునందునె షడ్గుణంబులుఁ
నేరిచియుందురేవి యన । నిత్య మసత్యము వంచనం బనా
చారము నిర్దయత్వమును । సాహసముఁ జలియించుబుద్ధి నీ
యారనుగాక పిమ్మట గ।యాశితనంబు వహింత్రు రాఘవా. 89

వారధి మేరతప్పినను । వైద్యుడు కుచ్చితుఁడైన భూపతుల్
నేరము లెన్నకుండిన ము।నిప్రవరుల్ గడు రోషగించినన్
ధారుణి పండకున్న ఋతు।ధర్మపు వర్షములేకయున్న సం
సారము బెట్టుతప్పిన య।సాధ్యములేగద వీరరాఘవా. 90

సారవిహీనమై కడు నసాధ్యమునై భయమై యరణ్యమై
వారధియై పిశాచమయి । పాతకమై భ్రమయై చెలంగు సం
సారమునందు జిక్కి మది । చంచలమై జడుఁడై నరుండు నీ
తారకనామమంత్రము స।దా పఠియించఁగలేడు రాఘవా. 91

మానము ప్రాణము న్గులము । మానుషము న్గుణమున్ సుకీర్తి స
న్మానము పెండ్లమున్ దన కు।మారుని బంధుని మిత్రునిన్ దయా
హీనత వీడుగాని మది । నెంతయు నుంత ధనంబు వీడఁగా
బూనఁడు మానవుం డతని । బుద్ధిని నేమనవచ్చు రాఘవా. 92

ఎలుగులు తా గుఱాలవునె । యిత్తడి పుత్తడియౌనె గోరువం
కలు కలహంసలౌనె చెడు । కాకులు కోకిలలౌనె జంబుకం
బులు కలభంబులౌనె । శశము ల్పులులౌనె కురంగసంచయం
బులు పశులౌనె దుష్టు లటు । పుణ్యులుగారుగదయ్య రాఘవా. 93

క్రూరుని భూమిపాలకుని । కొండెము సెప్పెడువానినిన్ మహా
వీరవరు న్పతివ్రతను । వెంగలినిన్ ధనవంతునిన్ సదా
చారుని సత్కవీశ్వరుని । సత్సఖునిన్ నిజబంధునిన్ సదా
వైరిగజూడరాదు బల । వర్ధనుఁడైనను వీరరాఘవా. 94

సారసమందు పుష్పరస । సారము గ్రోలుచునుండలేక ఝుం
కారముజేసి షట్పదము । గ్రక్కున సంపెగ జొచ్చి కూలు న
ట్లారయ నీదు నామస్మర । ణామృత మానక పామరుండు సం
సార పయోధిలో మునిగి । సద్గతినొందడు వీరరాఘవా. 95

నరములు శల్యముల్ బుసులు । నాడులు ప్రేవులుగల్గు కామినీ
మురికి ఘటంబుగాంచి యది । మోహనజంత్రముగాదలంచి తా
మురియుచునుండు మానవుఁడు। మోక్షము స్వర్గము బ్రహ్మలోకమా
తరుణియె యంచు నీ మృదుపదంబులు గొల్వఁడదేమొ రాఘవా.

ఇచ్చెడుదాత యీతఁడని । యెంతయు నాస గృహంబుచెంతకుఁ
వచ్చిన యర్థులంగని కవాటము మూయుచు దొడ్డివాకిటఁ
జెచ్చెర నేగి రాత్రి కిలు । సేరెడు మూర్ఖుఁడు ప్రాణముండియుఁ
జచ్చినవాడె యన్నరుని । జన్మము జన్మమె వీరరాఘవా. 97

ఇనుమునుగూడి యగ్నికి న। హేతుకమై వెసపెట్లు గల్గి న
ట్లనయము ఘోరపాతకచయంబులుజేయు మహాదురాత్మునిఁ
జనవున బిల్చి వానియెడ । సఖ్యముతప్పక సేయుచున్నచో
ఘనునకునైన నిక్కముగ । గష్టము లెన్నియొ కల్గు రాఘవా. 98

కాల మతిక్రమించి తన । కాయము డస్సి మహాక్షుధార్తు డే
వేళకు వచ్చినం గని వి।వేకుఁ డితండు దురాత్మకుండు చం
డాలుడు నా దలంపక , ఘనంబగు ప్రీతిని క్షుత్తు దీర్పగా
జాలిన పుణ్యవంతులకు । స్వర్గము మోక్షము గల్గు రాఘవా. 99

ఆకలిగొన్న మానవుల । కన్నవిధానము దెల్పినంతనే
యాకలి దీరునా కడు ర।సాన్నము మెక్కినగాని యట్లనే
చేకొని జన్మజన్మములఁ । జేసిన పాపము పుణ్యవార్తచే
బోకడచెందుఁబెట్లు నిను । పూజలుచేసినగాని రాఘవా. 100

మ్రింగను కూఁడులేక తన। మీసల సంపెఁగనూనె బూయుచున్
జెంగులు జారగట్టి కుడి । చేతను బెత్తముపట్టి వేగ వే
శ్యాంగనయిల్లుచేరి కల।యర్థమొసంగి విటుండు పిమ్మటన్
కొంగులు సాచి భిక్షమున।కుం దలపెట్టుగదయ్య రాఘవా. 101

అరయగ శుక్లపక్షమున । నాది సుధాంశుడు సూక్ష్మరూపియై
విరివి గతా గ్రమక్రమత , వృద్ధిని జెందినమాడ్కి ధాత్రి స
త్పురుషులతో నిరంతరము । బూనిన సఖ్యము నాటినాటికిన్
బెరుగుచునుండు నిక్కమని । పెద్దలు సెప్పుదురయ్య రాఘవా.

సత్రము బావి దేవళము । సద్వనమున్ రచియింపజాల కే
పత్రమొ పుష్పమో ఫలమొ । పాయసమో తనకున్నదానిలో
గృత్రిమ బుద్ధిలేక కడుప్రీతిని నర్థుల కిచ్చునట్టి స
త్పాత్రుఁ డుదారవంతుఁడు గృపాలుఁడుగాదె తలంప రాఘవా. 103

పాలును నీరు వేరుపరు।పందగి రాజమరాళ మెట్టులా
పాల గ్రహించునో యటుల । పావనులై విలసిల్లు పుణ్యులున్
గూళులు చేరియున్న భువి , గుత్సితులం దునిమాడి శీలులన్
బాలనజేయుదీవు భళి । పంకజనాభ ముకుంద రాఘవా. 104

ఎన్నఁగఁ గాంచనంబు పుట మేసియు సమ్మెట సాగగొట్టినన్
వన్నెదొలంగనట్టు లెద , బాయక ధర్మమునిచ్చునట్టి సం
పన్నున కెట్టి కష్టములు , ప్రాప్తములైన చలింప కెప్పుడున్
మన్ననజేయు నర్థులను , మానడు ధర్మగుణంబు రాఘవా. 105

చదువను వ్రాయనేర్చి సద । సత్వవివేకముగల్గువాని కే
కొదువయు కల్గపోదు సమ । కూడు సమస్తసుఖావహంబులున్
వదలక నీ పదాబ్జములు । భక్తిమెయిం దలపోయు మానసం
బొదవిన వారు సద్గతిని , బొందుట కేమి కొరంత రాఘవా. 106

ఇచ్చెదనంచు నోట వచియించియు బిమ్మట నీయకుండినన్
బిచ్చము పెట్టగా దలచి । పెక్కులు దూషణచేసి పెట్టినన్
కుచ్చితుఁడై వివాహములకుం దగ భంగము సల్పజూచినన్
వచ్చును పాతకం బనుచు । పల్కుదు రార్యులు వీరరాఘవా. 107

కాలముతప్పి కష్టదశ , గల్గినవేళ నధైర్యవంతులై
పోలగ బంధు లిండ్లకును । బోయినవారలు గౌరవించకే
హేళనచేయుచుంద్రు నుతి , కెక్కిన మిత్రుని యింటికేగినన్
జాలినిచెంది యాత డుపచారముచేయుగదయ్య రాఘవా. 108

ఆకలిబాధచే నతిథి । యన్నము బెట్టెదొసంగుడంచొగిన్
వాకిటవచ్చి నిల్చిన కవాటము మూసి జడుండు నింటిలో
నాకొని దా భుజించెడు పదార్థము గోవుశరీరమాంసమున్
గాక రసాన్న మెట్లగును , కంజదళేక్షణ వీరరాఘవా. 109

తలచిన మోక్షమీయగల, దైవము దైవము తల్లిదండ్రులన్
బాలుపుగఁ బూజచేయగల । పుత్రుడు పుత్రుఁడు కష్టవేళలన్
మేలుకువతో ధనంబొసగు, మిత్రుఁడు మిత్రుఁడు పంతమూనకే
పలుమరు వచ్చుచున్ జనెడు । బంధుఁడు బంధుఁడు వీరరాఘవా.

స్నానము సంధ్యయున్ జపము,సల్పుచు ధర్మముసేయకుండినన్
గానముచేయుచున్ శ్రుతులు, కల్గియు కంఠము సొలకుండినన్
సూనుఁడు కల్గియుండియు । యశోనిధిగాక దురాత్ముఁడైనచో
హీనముకాక యిద్ధరణి । నేమి ఫలంబగు దాన రాఘవా. 111

ఇష్టములేని భార్య నటియించు తెలంగిది యత్తమామలన్
గష్టముపెట్టు దిట్టు తలకాయకు సున్నపుపట్లు పెట్టు బల్
నష్టముతెచ్చిపెట్టు తన । నాథునిఁ బట్టుగఁబెట్టు రట్టు వి
స్పష్టము పుట్టినింటికి నెపంబడి పో సమకట్టు రాఘవా. 112

దురితుఁడు క్రూరమానసుఁడు'దుష్టుఁడు నీచుడు దుర్మదుండు పా
మరుఁడు జడుండు తామసుడు । మాంద్యుడు మూఢుడు పాత
[కుండు సం
కరకులజుం డటంచు మది, కష్టముచెందక ప్రాణభీతిచే
శరణనువాని బ్రోచుటయె । సజ్జనధర్మము వీరరాఘవా. 113

హాటకచేల రత్నమయ । హార పరాత్పర మేరుధీర యో
కోటి రవిప్రకాశ స్మర । కోటివిలాస రమేశ నే వెయిన్
మాటపదాఱురత్నముల । నోమను గానుకలీయలే కిదే
మాటపదాఱురత్నముల । సుధ్వీతి గైకొనుమయ్య రాఘవా. 114

ఇమ్మహి సర్వసంపద వహించిన హూణశకంబునందు పం
దొమ్మిదినూర్ల మీదటను । దోడ్పడ నిర్వదినాల్గవాబ్దమం
దీమ్ముగ నే నవంబరున । నీ శతకంబు రచించినాఁడ ప
ద్యమ్ముల దప్పులన్విడచి । తద్దయు నొప్పుగ గొన్మ రాఘవా.

శ్రీకర కొండమూది నరసింహ గురూత్తము శిష్యుఁడన్ గుణ
శ్లోకుఁడు తూము సుబ్బయకు । సుబ్బమనామ సతీమతల్లికిన్
బ్రాకటమైన బుత్రుఁడ పరాశరగోత్రుఁడ శేషయాఖ్యుఁడన్
నీ కరుణాకటాక్షమున , నే రచియించితి దీని రాఘవా. 116

శ్రీరామార్పణమస్తు

సంపూర్ణము



రామా ప్రెస్, తెనాలి.